

ఓం

శ్రీరామాయనమః

# వెంకటేశ్వర శతకము

ఉ. శ్రీరమణీమణీహృదయసీమ వెలింగెడు దివ్యమూర్తి బృం
దారకకోటిమౌళిమణిదర్పణదీపిత పాదపీఠ! యో
వారిజనాభ! యోవరద భవ్యయశస్సుఖ సంపదాళితో
మీఱెడునాయువున్గరుణ మేకొనఁజేయుము వెంకటేశ్వరా॥ 1

ఉ. శంకలువీడి మానస మొసంగితి నీకతిభక్తితో నా
తంకములెల్లఁద్రెంచి నను దాటఁగఁజేయు భవాంబురాసి నీ
పంకజసన్నిభంబులగు పాదయుగంబును గొల్తునయ్య! యో
వేంకటశైలనాథ! నిను వేఁడెద నిచ్చలు వెంకటేశ్వరా॥ 2

ఉ. పాపములేని సంసరణ భారముఁబూని తొలంగఁజాల కే
దారియటంచుఁ బల్కరు నిదానముగా మదినిల్పి యోజనం
బారగసల్పి కాంచక ప్రభూమూకుల చిత్తదుర్గతినింక నా
భారమునీవె తాల్చినను పాలనసేయుము వెంకటేశ్వరా॥ 3

ఉ. నమ్మితి నీపదంబులను నాదగుసంకట సంచయంబులన్
వమ్మొనరించి నీవిమల భవ్యమనోజ్ఞసురూప దర్శనం
బిమ్ము నిరంతరంబు భవబీజములన్ మొలకెత్తనీక స
త్యమ్ము సుఖాస్పదమ్మునగు దారినొసంగుము వెంకటేశ్వరా॥ 4

ఉ. ఆపదలెల్లఁబాపి కరుణార్తిని నీనిజభక్తకోటికిన్
బ్రాపయినిల్చి కామ్యములు వారిగనిచ్చెడుకల్పశాఖియుం
జేపడెబుద్ధిలోన నది చేరిచి భక్తిరసాన పెంచెదన్
శ్రీపతి యెట్లుకాచెదవొ చిన్మయరూపక! వెంకటేశ్వరా॥ 5

చం. చదువఁగలేను శాస్త్రములు సల్పఁగలేను తపంబు దానముల్
మొదలెహుళక్కి; రిత్తతమ కర్మదపమ్ము రిపునిగ్రహంబు నీ
పదములనమ్మినాఁడ సురపాదప! లోపములెన్న కార్తులన్
వదలిచి చేరదీసి ననువారక బ్రోవుము వెంకటేశ్వరా॥ 6

ఉ. కొండలుమూఁడునాల్గుదరిఁ గూడనివాసముచుట్టు శైలముల్
మెండుగకోటగోడలుగ మేకొనిదుర్గమమై జనాళి కు
ద్దండభరంబుగూర్ప సతంబును శోధనచేసిభక్తులన్
దండిగఁ బ్రోచుదేవుఁడ వుదారత తిర్పతి వెంకటేశ్వరా॥ 7

ఉ. ఇమ్మహిఁగల్గు తీర్థములఁ గెల్లను మేటియటంచు పావనా
శమ్మను పుణ్యతీర్థమున స్నానమొనర్చి విశుద్ధులై త్వదీ
యమ్మగుపాదపద్మముల నారనువమ్మిన జేర్చు భక్తుల
బ్రమ్మగ నీపదంబునను వారకనిల్తువు వెంకటేశ్వరా॥ 8

ఉ. శక్తికొలంది నీసుగుణసంచయమున్నుతియించువాఁడ
నాసూక్తులఁగల్గు లోపములఁ శోధనఁజేయక పుత్రుఁడై వడిన్
భక్తునిఁ బిల్వఁగైకొనగ ప్రార్థనఁజేసెద చిత్తగింపుమో
భక్తశరణ్య! యోగిజనభావసమాశ్రయ! వెంకటేశ్వరా॥ 9

ఉ. సోమకుఁడన్సురారియటు చోరతవేదములన్ హరింప బ్ర
హ్మామరకోటిచేష్టచెడ మాపదఁబాపఁగ నిన్ను వేఁడ నీ
వామిఁక మత్స్యరూపమున నాతని జీల్చి శ్రుతుల్ గ్రహించితో
కామితదాయి! నీపదయుగంబును గొల్చెద వెంకటేశ్వరా॥ 10

ఉ. మున్నుసురాసురుల్ గలసి మోదమునన్ తరిమందరంబుగా
పన్నగనాథుఁ ద్రాడుగను పన్నిపయోనిధిఁ ద్రచ్చఁబూనగా
గ్రన్ననశైల మబ్ధిమునుఁగంగ మఠాకృతిఁబూని వీపుపై
తన్నగముందరించితి వుదారత తిర్పతి వెంకటేశ్వరా॥ 11

ఉ. రాక్షసవంశవార్నిధికి రాజితమౌబడబాగ్నియౌ హిర
ణ్యాక్షుఁడు జీవకోటికడు నాపదఁజెందఁగ భూమిఁజుట్టగా
నాక్షణమే వరాహమయి యాతనిఁగూల్చితి విక్రమంబునన్
బక్షికులేశ వాహ! నిను బ్రస్తుతిఁజేసెద వెంకటేశ్వరా॥ 12

ఆదట విష్ణుభక్తియుతుఁడౌ దితిజేశ్వర సూనుఁడైన ప్ర
హ్లాదుని పెక్కుభంగుల సురారి దయారహితాత్ముఁడై స్వభా
వోదిత దుష్టబుద్ధిఁ గడు నొంపఁగ నీవు నృసింహమూర్తివై
యాదితిజున్ హరించితివి యబ్బురమానటు వెంకటేశ్వరా॥ 13

ఉ. దానగుణంబునందు బలి దైత్యునిఁ బోలినవాని నెందు నే
గానమటంచు ముజ్జగము గౌరవమొప్ప నుతింప రాజ్యమున్
బూనిన వామనాకృతిని మూఁడు పదంబుల వేఁడి లోకముల్
బూని కనాక్రమించితివి భూరిగుణాకర వెంకటేశ్వరా॥ 14

చం. జగతిఁ గలట్టి క్షత్రియ సుగుంతతి నిర్వదియొక్కమారు శౌ
ర్యగతి విరాజితోగ్రతఁ గరాసి వధించి తదీయ రక్తమం
దోగి పితృదేవ తర్పణము నొప్పఁగఁ జేసితి భార్గవాఖ్యతో
నగునె నుతింప నీకథలు హారిమృదూక్తుల వెంకటేశ్వరా॥ 15

ఉ. కోసలకన్యగర్భమునఁ గూర్మిజనించి వసుంధరాసుతన్
వాసిగఁ బెండ్లియై దనుజ వారము సంహరణం బొనర్పఁగా
జేసి ప్రతిజ్ఞ దండకను జేరి చతుర్దశ హాయనంబులన్
జేసితి దుష్టశిక్ష రఘుశేఖర తిర్పతి వెంకటేశ్వరా॥ 16

ఉ. దేవకిగర్భమందు వసుదేవునకున్ సుతుఁడై జనించి లో
కావనదీక్షఁ గైకొని యఖండపరాక్రమ మొప్పఁ బల్వురన్
దేవవిరోధులన్ దునిమి తీర్చితి భూభరమాత్మతత్త్వమున్
వావిరి పాండుసూనునకు భవ్యతఁ దెల్పితి వెంకటేశ్వరా! 17

ఉ. యాదవవంశమెల్ల మరి యాదకనం బలరాముఁడంచు పే
రూది యరాతివర్గము మహోగ్రముగా వధియించి లోకముల్
మోదముఁ జెంద విక్రమము బూనితి సంగరమందు భక్త స్వః
పాదప! నిన్నుఁ గొల్చెదను భక్తజనప్రియ వెంకటేశ్వరా॥ 18

ఉ. బుద్ధుఁడనంగఁ బేర్వడసి భూమిని కల్గిన ప్రాణికోటిలో
వృద్ధుల రోగులంగని భరింపగరాని విచారహేతువౌ
పద్ధతిమాన్ప ముద్దుసుతు భార్యను వీడి వనంబుఁ జేరి లో
కోద్ధరణం బొనర్చితివి యోగ్యమతంబున వెంకటేశ్వరా॥ 19

ఉ. ధర్మవిహీనవర్తనుల దండనసేయఁగ లోకసంచయం
బర్మిలి రక్షసేయఁగలి కాకృతిమానవరూపమొంది స
త్కర్మలఁ బ్రోత్సహించి జన కాండముఁ బ్రోచెద వార్తరక్షణా!
నిర్మథితారి! నీచరణ నీరజముల్ విడ వెంకటేశ్వరా॥ 20

ఉ. పరులధనంబుఁ గోర పర భామలఁ గోరను స్వీయలబ్ధితో
జరపెద కాలమున్ బరుల సాయముఁ గోరక నీపదంబులే
నిరతము నమ్మి కొల్చెదను నేరను చేయ పరాపకారమున్
కరుణఁదలిర్ప నన్నెటుల గాచెదవో గద వెంకటేశ్వరా॥ 21

ఉ. నాలుగుమోములన్న లువ నాగవిభుండటు వేయిమోములన్
జాలరు నీగుణంబులను సన్నుతిసేయగ నష్టచిత్తుఁడన్
బాలుని లీలనానుతుల మన్ననఁ జేసి కటాక్షవీక్షలం
జాలగఁ బ్రోవుమయ్య నిను సన్నుతిఁ జేసెద వెంకటేశ్వరా॥ 22

చం. నిరతము పాపచింతనల నెమ్మదిఁ జేర్చి దుష్టచేష్టలం
గరమనురక్తిఁ జేసి తమ కాలము బుచ్చుచు నన్యవిత్తముల్
దరచుగ సంగ్రహించుచును దారసుతాదులఁ బ్రోచు దుష్టుల
బ్బురముగ పెద్దవైరిసుర పూజిత తిర్పతి వెంకటేశ్వరా॥ 23

చం. నిరతము సత్ప్రవర్తనను నెక్కొని ధర్మపరైక కార్యముల్
నెరపుచు వాఙ్మనఃకరణ నీమముతో నరిషట్కమున్ని రా
దరణ మొనర్చి భక్తిలతఁ దన్పుచుఁ బ్రేమరసంబుతోడ నీ
చరణము లాశ్రయించెదను సాధుజనప్రియ వెంకటేశ్వరా॥ 24

చం. కరమనురక్తి నీచరణ కంజములన్ మదిఁ జేర్చి భక్తితో
నిరతము నామకీర్తనము నేనొనరించెద పాపపుంజముల్
దొరగఁగఁ జేసి సద్గతిని తూర్ణమొసంగుము సమ్మినాడ నా
భరమది నీవశంబెసుమి పావననామక వెంకటేశ్వరా॥ 25

ఉ. దారసుతాదులందఱు సదా తమ లాభముఁ గోరి పెక్కులౌ
కారణముల్ నిరంతరము గల్పనఁ జేయుచు ద్రవ్యవాంఛచే
మీరినకోర్కెలన్ మిగుల మేకొని వంతను గూర్తురిట్టి సం
సారమసారమంచుఁ గన జాలరు లోకులు వెంకటేశ్వరా॥ 26

పెక్కుతెరంగులా వెతలు బిట్టుగఁ గల్గినఁగాని నిత్యముం
జిక్కులతోడ మానసము చిందరవందర యౌచు డీల్పడన్
దిక్కరిమార్గచిత్తులగు దీనులు నీదెసఁ గాంచజాలరా
మ్రొక్కులు వెట్టి లోకములఁ బొందెదరో గద వెంకటేశ్వరా 27

ఉ. వారణనాథుఁడా మకరి వల్లభుచారికిఁ జిక్కి సంతతం
బారనివంత చేఁబడలి భావము నీపద కంజయుగ్మముం
జేరిచి నిన్ను జీరవడి జేరి మహాపదఁ బాపి శాశ్వతం
బౌ రమణీయ సత్పదము నాతనికిచ్చితి వెంకటేశ్వరా॥ 28

ఉ. హేల ననేకదుష్కృతము లెల్లపుడుం బొనరించు నాయజా
మీళుడు చావుకాలమున మిక్కిలి ప్రేమను నీదునామముం
బోలిననామముం గలుగు పుత్రుని బిల్వగ వానిపాపముల్
దోలియనుగ్రహించితివి దోయజలోచన వెంకటేశ్వరా॥ 29

ఉ. నీసుచరిత్రముల్ వినుచు నీపదయుగ్మమె నమ్మి కొల్చుచుం
వాసిగ నీకథల్పలుకు వారలె కా భవదీయ దాసు లా
దాసుల దాసుఁడన్ మదికి దార్చితి నీపదకంజభక్తి నో
వాసవవందితాత్మపద! వారిజలోచన వెంకటేశ్వరా॥ 30

చం. సతతము కూటసాక్ష్యముల సల్పుచు లోకుల వస్తుజాలముం
సతుల నుగొంట; దురాత్మనుతి వైరములేమి పరాపవాదముం
గసులుగ నిత్యజీవనముఁ గాంచెడుమూర్ఖులె మాన్యులైరి యే
గతి భవదీయ దాసులకు గల్గనొ యీకలి వెంకటేశ్వరా॥ 31

ఉ. నీపదసేవఁ జేయు మహనీయులు లౌకికవాంఛలన్నిటిన్
రూపడఁ జేసి ధర్మగతి లోపము లేని విశుద్ధవర్తనం
బాపద లేని జీవనము నార్తి నెఱుంగని మానసంబుతో
తాపములెల్లఁ బాసెదరు వాంఛితదాతవ వెంకటేశ్వరా॥ 32

ఉ. కాపురుషుండు లౌకిక సుఖంబులఁ గోరి నిరంతరంబు చిం
తాపరుడై పరార్థముల నాసయొనర్చి యధర్మవర్తనుం
డై పరకాంతలన్ గవియ నారయుచుండు పరేతరాట్పురిన్
జేపడు యాతనల్ మదిని చింతయొనర్పక వెంకటేశ్వరా॥ 33

చం. నిరతము నీపదాబ్జములను నెమ్మదిఁ జేర్చి భజించుమానవుల్
బరువడి పూర్వజన్మ భవ పాతకకోటులఁ బాసి వేడ్కతో
జిరముగ పుణ్యలోకములఁ జేరి నిరంతర సౌఖ్యసంపదం
బరగుదు రబ్ధిజాహృదయ వారిజభాస్కర! వేంకటేశ్వరా॥ 34

ఉ. దారసుతాదికంబగు పదార్థములెల్ల నిరంతరంబు సం
సారమహాబ్ధిఁ ద్రోపిడఁగ జాల సమర్థములౌటఁగానకే
పారెడు లోభమోహగుణ వారము పాల్పడి మూఢమానవుం
డోరమణీయమూర్తి! నిను నోర్వడు కానగ వేంకటేశ్వరా॥ 35

ఉ. వేకువ నిద్రలేచి నిను బెక్కువిధంబులఁ బ్రస్తుతించి ని
ర్వ్యాకుల వృత్తి కల్యముల నర్తిలఁ జేసి స్వధర్మరక్షణా
స్తోకమతిం ధనార్జనము చొప్పడ ధర్మవిరుద్ధ వర్తనల్
పోకడబెట్టి జీవితము పుచ్చు బుధాగ్రణి వేంకటేశ్వరా॥ 36

చం. కరుణ దలిర్ప మానవుల కష్టములం దొలగించి కావ నే
ర్పరివిక దయ్య యట్లగుట భక్తి భజించెద నన్యచింతలన్
మరచి నిరంతరంబు కను మాయానుమానము వీడి భక్తసన్
పరమదయాంతరంగమున బ్రాపు నొసంగుచు వేంకటేశ్వరా॥ 37

చం. దురితములెన్ని చేసినని దోసములెంచక బాలురీతి నా
భరము వహించి సంతతము పాపవిదూర సువర్తనంబున
న్నిరతము నీపదద్వయ వినిర్మల భక్తి నొసంగి ప్రోవ నా
తురత వహింపుమయ్య బుధతోషణ! తిర్పతి వేంకటేశ్వరా! 38

ఉ. తండ్రి! మదీయమానసము దార్చెద నీపదపంకజద్వయిన్
గండ్రతనంబు మాని ననుఁ గారవమొప్ప పరిగ్రహించు మో
తండ్రులకెల్ల తండ్రియును దైవమునై విలసిల్లు దేవ! నా
వంద్రలు తీర్చి సంతతము వారిజలోచన! వేంకటేశ్వరా॥ 39

ఉ. ఇంద్రియవర్గ మెంతయు నహీనబలంబున దుర్గుణాళితో
సాంద్రముగా పెనంగొని విశంకట వృత్తిని మానసంబునన్
తంద్ర మొనర్చు నిశ్చలతఁ దాకానీయక సంతతంబు ని
స్తంద్రతఁ గూర్పుమయ్య నిరతంబు భజించెద వేంకటేశ్వరా॥ 40

...నగలట్టి భోగములఁ బొందగఁ గోరి విమోహవర్తనుం
డవిరతయత్నముల్ సలుపునాదృతిమానడు లాభకాంక్షచే
దివిరియశాశ్వతంబయిన దేహమునెంచక నీపదాబ్జముల్
దవిలిభజింపనేర్చునెటు తాపసవందిత! వెంకటేశ్వరా॥ 41

చం. కరమనురక్తి భార్యకును గాదిలిపుత్రులకుం హితంబు చే
కురుటకుగా ధనంబుపడి గూర్చును, యౌవనమేగ వార్ధకం
బిరువుకొనన్ శరీరమున మృత్యువు సన్నిహితంబుగాగ పా
మరుడెటు దిక్కులేక వెతఁ బ్రొన్నడు తిర్పతి వెంకటేశ్వరా॥ 42

ఉ. దేహము సంపు ప్రాణములు తీరుగనుండిన యంతసట్టు సం
దేహముమాని నీచరణనీరజయుగ్మము పూనికొల్వగా
మోహలతాలవిత్రమగు ముక్తిపథంబును కానవచ్చు గా
దేహరి! నీకృపాగరిమ నెంచ! సురార్చిత! వెంకటేశ్వరా॥ 43

ఉ. తాపసవందితా! పివిధ తాపములంబరిమార్చి మానసం
బోపిక నీపదాబ్జముల నూనిభజింపగ నీకటాక్షముం
జూపుమనన్యభక్తినిడి చుట్టము దిక్కము తల్లితండ్రి నీ
వేపరమాత్మ! లేరొరులు విశ్వజనప్రియ వెంకటేశ్వరా॥ 44

ఉ. నమ్మితి నుల్లమందు మన నాతిన మా భవదీయ తత్త్వమున్
జిమ్మిరి నాత్మ తృప్తులఁ జెందిరవందరగాగ భక్తిసో
గ్రుమ్మితినిత్యమై చెలగ కోరిక లేరికలత్త; నీదులో
కమ్మున చేర్చి శాశ్వత సుఖంబడపంబడు వెంకటేశ్వరా॥ 45

ఉ. అబ్బురమయ్య నీపద సరము శ్రయగాంచనమంది కోతి దా
గొబ్బున దాటె సంద్రము నరకుంఠిత వేగమున న్మహాబ్ధిలో
ద్రొబ్బగఁ గుండ్లు బెండ్లగతెఁ దూల్లిమ తేలెను మానుషాదులన్
ప్రబ్బిన వానరసాలి శిలభంబుల వడిఁ బిల్కు మార్చె నో
యబ్బ! త్వదీయశక్తి ననయంబునుతించెద వెంకటేశ్వరా॥ 46

ఉ॥ గంధములోన కప్పురము గల్పినయట్లు సువర్ణభూషలం
బంధ మొనర్చి రత్నముల బ్రాపునొనర్చినయట్లు సాధుసం
బంధముకల్గు మర్త్యునకు భవ్యగుణంబులు చేరినట్లుగా
బంధురమైన పాండితిని భక్తినినాకిడు వెంకటేశ్వరా॥ 47

ఉ. గర్భమునందుఁ జేరి పలుకష్టములం దురపిల్లి యార్తితోఁ
దుర్భరవేదనల్బడి యధోచితరీతి తరించి స్వేచ్ఛమై
నర్భకుడై వివేకమును నారడిపెట్టును మానవుండు గా
స్వర్భువనా! భవాబ్ధితరి వై కరుణింపుము వెంకటేశ్వరా॥ 48

ఉ. నేరనిబాలునిం బ్రియముసెక్కొనఁ దల్లి నిరంతరంబుఁ దా
బేరిమిబుద్ధులం గరపి పెద్దయొనర్చెడిరీతి నాకు నీ
కారుణికత్వమొప్పగను గాఢతమంబు తొలంగఁ జేసి పెం
పారెడు జ్ఞానలేశ మిడుమయ్య దయాంబుధి! వెంకటేశ్వరా॥ 49

ఉ. చెడ్డయు మంచియుం దెలియఁ జింతయొనర్పక యెప్పుడేది చే
సడ్డ నదెల్లఁ జేయుచును బాలుని వైనడి, మూర్ఖపోలిక
గ్రుడ్డితనాన కాలమును గూర్చితి యౌవనమేగె వార్ధకం
బొడ్డెను దిక్కునీవనుచు నుంటిని కావుము వెంకటేశ్వరా॥ 50

ఉ. ఆయువులో సగంబు వృథయౌచు చను రాత్రులనిద్రతో శిశు
ప్రాయమునందు కొంతయును వార్ధకమందునఁ గొంతబోవు నా
ప్యాయముగాగ నీవిమల భవ్యమనోహర నామకీర్తనం
బాయతిఁ జేయనైతి నెటులారసి కాచెదొ వెంకటేశ్వరా॥ 51

ఉ. పాయనిచింతసంసరణభారము నా శిరమందునిల్పి నీ
జాయను బిడ్డలన్ మనుపఁ జాలెడు పుష్కలసాధనంబు నే
చాయ లభించు నంచనెడి చాలవిచారము యౌవనంబుఁ గ
బాయదు నీపదాబ్జయుగభక్తిని బాపుచు వెంకటేశ్వరా॥ 52

ఉ. కాయముకల్గినందులకు కాంతలఁ బుత్రుల రక్షసేయుటా
శ్రేయము? ఇంతకంటెమును జెందితి నెన్నియొ దేహసంచయం
బీయొకఁ గల్గినట్టి తనువిద్దియు నంతియొ కాక శాశ్వతం
బే? యనఘాత్మ! యొల్లనిక నీభువిపుట్టువు వెంకటేశ్వరా॥ 53

ఉ. కొండలవంటిపాపములు కూలు భవత్కమనీయకీర్తనా
ఖండమహత్వశక్తిని ప్రకామసుఖానుభవాతిరేకముల్
మెండుగఁ గల్గు నీవిమల మేచకరూపముఁ గాంచి నంతనే
అండజవాహ! నిన్ను ననయంబుఁ భజించెద వెంకటేశ్వరా॥ 54

"నారునుపోసినీరిడఁడె?" నాఁజను సూక్తి నిజంబు కాదొ? యీ
ధారుణి జీవకోటి నియతంబుగ సృష్టియొనర్చినట్టి యా
ధీరుడుతున్నివారణకు తేకువనన్న మొసంగడే? మనో
భీరుత కాదె పొట్టకయి వెంపరలాడుట వెంకటేశ్వరా॥ 55

ఉ. స్థావరజంగమాత్మకపదార్థచయంబఖిలంబు నీవిలా
సావహమై చెలంగుట నిరంతరముగ్గనఁజాలకే నరుం
డావిలమానసుండగుచు నర్థముఁ గూర్చును పొట్టకూటికై
యీవిధిజంతుకోటిఁ గన నెయ్యదిఁ దిర్పతి వెంకటేశ్వరా॥ 56

ఉ. రాతనసించు కప్పఁగన రాదె నిరంతరమామహాబ్ధిలో
ప్రాణిగనిల్చు జంతు నికరంబది కాంచుదెయన్న మట్లు ని
ర్భీతిగఁ బోషణశ్రమముఁ దాల్చుఁగఁ బూనక సర్వభారముం
నీతలనిల్పికొల్చెదను నిత్యసుఖప్రద! వెంకటేశ్వరా॥

ఉ. ఉదుతయదెంత? నీరనిధి యొడ్డున నిల్చి కపిప్రజంబు దా
బడబడ వార్ధిఁ దిగులఁ గాంచి బలుగుండలు వైచి సేతువుం
నడివడిఁ గట్టుచుండఁగని భక్తిని సైకతమంటు కొన్నయా
యొడలి విదిర్చెనంట యదియుం జలరాశిని వెంకటేశ్వరా॥ 58

ఉ. పండితలోకగమ్యము సుభాషిత రత్నపరీతమర్థస
త్తాండవసత్కర్షము సుఖస్థిరమా కవితామృతాబ్ధిను
ద్దండతఁ జేరఁగల్గుటకు దైక్యమొసర్చితి భక్తినాకనా
దండను గల్గ; భక్తజనతావినుతాశ్రయ! వెంకటేశ్వరా॥ 59

ఉ. అంజనానాహనీపవనమాశ్రయణంబది ఘోరపాతకో
ద్దండజనాళిదానవహనాధికసంపరిదగ్ధహేతువై
చెండదె మోఖసంచయము చిత్తవినిర్మల భక్తిభావము
కండముదయించదే యనలకంజవిలోచన! వెంకటేశ్వరా॥ 60

చం. హరిహయుచూడ్కిఁ గోఁ బడిన యట్టి యహల్యని జేఁశు శాపముం
బొరసి శిలాత్వమున్న నివిముక్తిని చయ్యనఁ గాంచఁజాలకే
పరితపియించుచున్న తరి పాదసరోజంబున దానినాతిగా
బరపిరివబ్బురంబు తమ ప్రాభవమెన్నగ వెంకటేశ్వరా॥ 61

ఉ. కాకమురూపుఁదాల్చి యొకకట్టిడిరక్కసుఁడా ధరాత్మజా
స్తోకకుచాగ్రభాగమునఁ దుంటరియై తనముక్కుతోడ బ
ల్వీకను దాఁకుచుండఁగని పీచమడంపగ గడ్డిపోచనే
బ్రాకటధాతృబాణమటు రాజిలఁ జేసితి వేంకటేశ్వరా॥ 62

చం. కరిపతినిన్ విభీషణునిఁ గౌతమపత్నిని బోయకాంతనున్
సురరిపుసూతినిన్ రవికిశోరమునున్ విహగాధినాథునా
సురపతిపుత్రినిన్ గరుణఁ జూపుచునేలిన నీకటాక్షమున్
బరపుము నాపయిన్ మిగులభక్తినుతించెద వేంకటేశ్వరా॥ 63

చం. కఠినచరిత్రుఁ బోయనొకకావ్యసుకర్తను చేసి పేర్మి త
త్పఠనము సర్వపాపచయవారకమై తగనీవు సత్కథల్
లురదమృతోక్తుల న్వెలయ లోకవిమోహన! చేసినావు కా
మరవిలసత్స్వరూప! కనుమా పెరిమంబున వేంకటేశ్వరా॥ 64

ఉ. కారియఁబెట్టు సంసరణగాఢతమంబు భవత్పదాబ్జప
స్తారదినాధినాథ నిరత పథిప్రతిమానిహీన తే
జోరమణీయదర్శనముఁ జొప్పడ దూరముగాఁ దొలంగఁడే
వారిజగర్భనందిత విభాస! జగద్ధిత! వేంకటేశ్వరా॥ 65

ఉ. క్షీరము నీరముంగలసి చెన్నలరారఁగ హంసముంచు లో
నీరమువీడి క్షీరమును నిచ్చలు తాఁగ్రహియించు పోలికన్
దారుణపాతకంబులను దాసులవాని నసల్లవీడి పు
ణ్యోరుకృతుల్ పొసర్చి సుకృతోదయుఁజేసెదవు వేంకటేశ్వరా॥

చం. తిరుమల స్వర్ణశైలముగ దివ్యమహీరుహపంక్తి చందనో
త్కరముగ స్వర్ణపూర్వముఖరైవతవాహినికాగ వైష్ణవుల్
సురతతికాగ పద్మభవచోద్యముగా నలమేలుమంగయై
పరగనిజాశ్రితాళిఁ బరిపాలనసేయుదు వేంకటేశ్వరా॥ 67

చం. తిరుమలదర్శనంబునను తీరును పాతకకోటి కొండలన్
దిరుగగ శేషశైలమునఁ దివ్యఫలాప్తి రహించుగోవెలం
బొరసిన భస్మభూషణ విభూషితుసీరమణీయమూర్తిఁ దా
నరుసమునంగసంగనగు నాతఁడు ధన్యుఁడు వేంకటేశ్వరా॥ 68

ఉ. పుష్కరిణీజలంబులను మోదముమీరగ స్నానమాడి తా
నిష్కపటాత్మ నీచరణ నీరజముల్ మదినిల్పిభక్తితో
శుష్కవిచారముల్ విడిచి మ్రొక్కులుసెదరిఁ జేర్చి కొల్చినన్
ముష్కరమైన పాతకస మూహముతీరును వెంకటేశ్వరా॥ 69

ఉ. పాహినిలింపనాథ! సుకృపాజలధీ! జలజాయతాక్ష! యీ
గ్రాహమునన్నుపట్టి కడుఁ గారియంబెట్టెడి జాలఁపతీ రా
డ్వాహ! మదీయబంధనముఁ బాపినిరంతర సౌఖ్యమిమ్ము సం
దేహమువీడు మన్న కరి నింగరుణించితి వెంకటేశ్వరా॥ 70

ఉ. నాతరమా నుతింపనిను సత్యసుధారస నారదీపితా
త్యాతతకాకలీనినద దర్శితకోకిల గానమాధురీ
పూతమరందబిందుచయ భక్తినిరంతర గీతికావినో
దాతతభృంగికానిః వహారివచోవిధి వెంకటేశ్వరా॥ 71

ఉ. ప్రస్తుతిఁజేసెదన్విమల భవ్యమనోజ్ఞ విలాసవాక్య వి
శ్వస్తవనీయకావ్యచయ సంభృత పద్యములన్ బుధాళికిన్
నిస్తులమోదముల్లసిల నేర్పును కూర్పును సొంపుఁగల్గ భ
క్తస్తుతిపాత్ర! నన్గరుణఁ గాంచుము తిర్పతి వెంకటేశ్వరా 72

ఉ. నిండుమనంబు నీచరణ నీరజషట్పద మట్లొనర్తునే
దండమహావిపద్గిరివి దారిణదంబ! దురాత్మదానవవ్రా
ద్దండతమఃప్రభేదన విధాంశుకోటి సమానతేజ! నీ
దండయొసంగిబ్రోవని దె దండముఁగైకొను వెంకటేశ్వరా॥ 73

ఉ. పద్మభవాదివందిత సుపాద! సుధాబ్ధిని శేషశాయివై
పద్మయు భూసతీమణియు భక్తిభజింపగ నీయనాభి నా
పద్మజుఁగాంచిలోకముల భద్రముగా సృజియింపఁ జేసితో
పద్మదళాక్ష! నాహృదయ పద్మముఁజేరుము వెంకటేశ్వరా॥ 74

ఉ. ఆప్తుల బంధు సంచయము నాలునుబిడ్డలవీడుచింత, సం
ప్రాప్తధనాధికంబునెడ బాసెడిచింత, శరీరయాత్ర సం
క్షిప్తమటంచుచింత, మదిఁ జిందరవందరచేయుఁ నాత్మ సం
తప్తముగాగ మృత్యుముఖ దర్శనవేళను వెంకటేశ్వరా॥ 75

ఉ. దుర్భరగర్భవేదనలఁ ద్రుంగుచు పూర్వభవార్జితాఘ సం
దర్భములెల్ల మానస పథంబున నెంచుచు సంతపించి తా
నర్భకుడై భువిం జననమంది తలంపడు మానవుండహో
స్వర్భవనా! త్వదీయపదసారసభక్తిని వెంకటేశ్వరా॥ 76

ఉ. పూర్ణిమనాటి చంద్రమునిఁ బోలిన నీముఖమండలంబు నే
వర్ణనసేయఁగల్గఁగల భాగ్యము నాకెటు లబ్బు సంతత
స్వర్ణగిరీంద్ర ధన్వికిఁ బొగసంగును గాక, త్వదీయరూపము న్
దూర్ణమెచూపలేవటం తోయజలోచన! వెంకటేశ్వరా॥ 77

ఉ. అద్రిసుతాధినేత తనయర్ధశరీరిణి కోరినంతనే
భద్రముగా నొసంగిన ప్రభావసమన్వితమంత్రరాజము
న్నిద్రతనే జపించి భవసింధి దాటగ నిచ్చగించితో
భద్రగిరీశనామన విబాలన సేయవె వెంకటేశ్వరా॥ 78

ఉ. ఆంధ్రునుబిడ్డలాప్తులును నర్థముకై దరిఁజేరినల్మరున్
తీంద్రమొనర్చి చేపడినఁ దిక్కనుచూడకఁ బాయుచుండగా
గంద్రతనంబు మానసముఁ గారియ పెట్టెడి దిక్కనీవె నా
తండ్రియుతల్లియున్ గురుఁడు దాతవుత్రాతవు వెంకటేశ్వరా॥ 79

ఉ. ధర్మము నాల్గుపాదములఁ దారొకనున్ కృతమందు; త్రేతయం
దర్మిలి మూడుపాదములనయ్యెడు; ద్వాపరమందు రెండుగాఁ
బేర్మిగనుం జగంబునను బిట్టుగ నీకలి నొక్కపాదమై
శర్మముఁగాంచె, సత్పురుషసంఘము చెల్పడ వెంకటేశ్వరా॥ 80

ఉ. చెప్పగలేను నీచరిత చెప్పినమాటలు చెప్పకుండ నా
తప్పుల నొప్పులంచు మదిఁ దారొకనఁజేసి నుతింపనిమ్ము మా
యప్ప! దయారసంబు ననయంబును నాపయిఁ జిల్కఁజేయుమో
యొప్పులకుప్ప! జాలమిక నోర్వను తిర్పతివెంకటేశ్వరా॥ 81

ఉ. కర్మలు జ్ఞానదాయకముగా మదినెంచక తద్విధానమే
శర్మమటంచు నోఁదలచి జాలగ బ్రహ్మవిచారమెప్పుడున్
నిర్మమతన్ దలంపడు వినీతిని పామరుఁడజ్ఞుడై విని
ష్కర్మతగీత చెప్పదె గజప్రభురక్షణ! వెంకటేశ్వరా॥ 82

బ్రాహ్మముహూర్తమందు హరిఁ భక్తి నుతించుచు నిద్రలేచి స
ద్బ్రాహ్మణవంశనిష్ఠిత సదాకరణంబులఁ బ్రొద్దుపుచ్చుచున్
బ్రాహ్మియుపాసనంబు నెడఁబాయక చేయుచునుంటిమాధవా!
బ్రహ్మముఖాఖిలత్రిదశఁవందిత! తిర్పతి వెంకటేశ్వరా॥ 83

చం. దురితవిదూరవర్తనముఁ దోషవిహీన మనఃప్రవృత్తి, దు
ర్భరమును కానిజీవనముఁ రాజసమొప్పని సత్ప్రవర్తనం
బరులనివేడఁబోవని గృహస్థితి నారడిపాలుగాని స
చ్చరితము, నాకొసంగు నినుఁజాలనుతించెద వెంకటేశ్వరా॥ 84

ఉ. ఆకలిలేని భోజనముఁ నారడిపాలగు వర్తనంబు ని
ర్భీకతలేని శౌర్యము విఁభేదనతంత్రములేని మంత్రముఁ
వాకులులేని నోరు రసఁవర్గమెఱుంగని జిహ్వ, మానసం
బాకులమైన నిద్రవృథఁయాగద తిర్పతి వెంకటేశ్వరా॥ 85

ఉ. నీపదభక్తిలేని జపనిష్ఠయుఁ నాసనశుద్ధిలేని లో
చూపును శాంతిలేని మనఁసున్ ఫలితంబు నొసంగనేర వీ
యాపదలం దొలంచి సకఁలార్థములంగననీదు భక్తియే
ప్రాపుగదా మదిందలపఁభక్తజనప్రియ వెంకటేశ్వరా॥ 86

ఉ. చిత్తము నీపదాబ్జయుగఁ చింతనమంద, కరంబులెంతయున్
బత్తిత్వదీయపూజనలఁ పాదములొప్పఁగ సనివాసమున్
హత్తుటయంద, వాక్కులనఁయంబుగుణావలివర్ణనంబునం
దత్తరపాటులేక నిరతంబునుకూర్చెద వెంకటేశ్వరా॥ 87

ఉ. శబరినిరంతరంబు నినుఁజాలనుతించి తరించలేదె యా
యబల యహల్య నీపదఁరాగముసోకిన రూపుగాంచదే
ప్రబలవిరోధముట్టఁగఁనిభప్రభుఁడాదట ముక్తిగాంచడే
నబలుఁడ నిన్ను వేడెతి కటాక్షమొసంగుము వెంకటేశ్వరా॥ 88

ఉ. తల్లియుఁదండ్రి దైవమునుఁ దాతయునీవని భక్తితోడ నీ
పల్లవసన్నిభంబులగుఁ పాదములన్మదినిల్పి యన్యముల్
పొల్లుగఁగాంచి సంతతముఁ పూజలొనర్చెద చిత్తగింపుమీ
కొల్లగ నీదయారసముఁ గూర్చుతిరంబుగ వెంకటేశ్వరా॥ 89

ఉ. చింతఁదొలంచి యన్యమును జేరగనీయక నామనంబు నీ
పొంతనునిల్పి భక్తిఁగదు పూజలొనర్చుట నాకువంతు నా
వంతల పారఁద్రోలి నిరవద్యసుఖంబిడ నీకువంతు నే
పంతము మీరకొల్చెదను భక్తసురద్రుమ! వెంకటేశ్వరా॥ 90

ఉ. చెప్పగరాని దోసములఁ జేసితి నేన్నిటో యవ్వనంబునన్
దెప్పరమై నవార్థకము ద్రిక్కఁగఁ జేసె మదీయదేహమున్
ముప్పుఘటిల్లె నేనిటుల మోసముఁ జెందితి గాసిఁ బాపిమా
యప్ప! త్వదీయభక్తుఁడను న్యాయముచేకొన వెంకటేశ్వరా॥ 91

చం. తనువున దుర్బలత్వమది దార్కొనె, నోటనుపండ్లుడుల్లె నిం
కనుమనమందు నాశయను గాఢపిశాచముపీడఁబోదు పా
వనమగు నీపదాబ్జయుగ భావననిత్య శుభంబుఁగూర్పదే!
వనజభవాదివందిత! శుభప్రద! తిర్పతి వెంకటేశ్వరా! 92

చం. తనువిది శాశ్వతంబనుచు దారసుతాదికమెల్ల నిత్యమం
చనవరతంబు లౌకిక సుఖాదిక వాంఛలఁ మానసంబులో
గొని భవదీయచింతనముఁ గోరదు నాకిక నేగిదిక్కు పా
వనమగు నీదుమంత్రము శుభంబొనగూర్పదె? వెంకటేశ్వరా॥ 93

చం. కరిపతి యాసుయోధనుడు గాఢవిరోధముపూని ద్రౌపదిన్
బరమపతివ్రతామణి సభాస్థలిఁ వస్త్రవిహీనఁ జేయగా
హరి! కమలాక్ష! దిక్కరితి నార్తను మానమురక్షసేయు మ
న్నెలవినివల్వలీయవె యమోఘముగాపడి వెంకటేశ్వరా॥ 94

ఉ. కోతులచే మహాబ్ధినటు గూర్చితి సేతువు, గడ్డిపోచ వి
ఖ్యాతిగ బ్రహ్మసాయక మొనర్చితి వెంతయుఁ నొక్కతూపునన్
బ్రాతిగ సప్తతాళములఁ భంగమొనర్చితి నబ్బురంబుగా
నాతరమానుతింపనిను నవ్యమృదూక్తుల వెంకటేశ్వరా॥ 95

చం. రవిసుతుగోడుమాన్ప సురరాజసుతుంబరిమార్చి తొంటిమై
దివిరిని శాతబాణమున తేజమెలర్పగఁ; గీశసంఘముల్
దవిలిభజింప వారి నిధి దాటినిశాటుని రూపుమాపితో
పవిధర ముఖ్యవందిత విభావశుభాకర! వెంకటేశ్వరా॥ 96

కాపోక్నుచీకటింగనులు కానని భంగియవిద్యతాసు సం
పర్కముకల్గు మూఢగుణ మానితుడెంతయుఁ గానలేడు వి
ద్యార్క వికాసనుస్థిర మహామహిమాస్పద జ్ఞానచక్షువున్
తర్కములెన్ని చేసినను దానవమర్దన వెంకటేశ్వరా॥ 97

ఉ. కారణకారణుండ! త్రిజగత్పతి! భక్తజనైకపోషణా!
వారినిధిప్రవిష్ట! యహివల్లభభోగశయాన! లోకసం
వారసముద్భవస్థితిని వారణకార్యకలాప! సంతతా
పారదయాంతరంగ! బుధపాలన! తిర్పతి వెంకటేశ్వరా॥ 98

ఉ. సేతువుదొట్టి శీతనగ సింధుసమావృత భారతావనిన్
ఖ్యాతినిఁగన్న తీర్థముల గారవమొప్ప మునింగి తద్గతా
త్యాతతదేవ దర్శనము సాదృతిమై బొనరించి పాపసం
ఘాతమడంచు మానవుడు ఖండితదానవ! వెంకటేశ్వరా॥ 99

ఉ. కన్నులకర్వదీర పులకాన్వితమై తనువుల్లసిల్లగా
నెన్నగరాని కోర్కె లుదయింపగ మానసమందు సంతతా
భ్యున్నతి హేతుకంబయి నపూజ్యమనోహరమూర్తిఁ జూపుమో
పన్నగతల్ప! భక్తసురపాదప! తిర్పతి వెంకటేశ్వరా॥ 100

ఉ. పన్నగనాథు తల్పమునఁ బాలసముద్రమునందు లచ్చి క
న్సన్నల మోదముంగనుచు సారసగర్భ ముఖామరాళిని
స్సన్నుతిసేయ లోకములఁ జక్కఁగఁ బ్రోచెదు లోకపాల! న
న్గన్నకుమారునైవడిని కావుము తిర్పతి వెంకటేశ్వరా॥ 101

చం. పుడమినికల్గుమానవ సమూహము నిత్యమునీషణత్రయిం
బడిభవదీయ చింతనము మానసమందున చేరనీయకం
బడిశము పాల్పడందనరు మత్స్యముపోల్కి నిరంతరంబుఁ దా
జెడుభవబంధదుఃఖములఁ జేష్పడివీడక వెంకటేశ్వరా॥ 102

ఉ. ఎన్నిభవంబులొందితినొ యెందరు దారలుపుత్రులైరో యిం
కెన్నియొ జన్మకోటులను నేను నిరంతరగర్భవాస మ
స్బన్నమునొందగావలెనొ భారము నీ పదపద్మయుగ్మముఁ
తిన్నగఁ జేర్చికొల్చెదను తీర్పవె నావ్యధ వెంకటేశ్వరా॥ 103

చం. ధనమదినిత్యమ్మామిగులఁ దాచిననేనియు నాశమొందు నా
రనికడగండ్లఁ గూర్చు, పగ రంజిలు గుప్తివిచారహేతువౌ
కనికరమార్తకోటి దెసఁ గల్గగనీదు విరాగమెప్పుడుం
గనగనసాధ్యమౌ మనముఁ గారియపెట్టును వెంకటేశ్వరా॥ 104

ఉ. పుట్టుకతో నహంకృతియు బొల్చు నువీడదు జీవితాంతమున్
కట్టిడి కార్యముల్ సలుపుఁ గాంచగనీయదు మంచిచెడ్డలన్
చిట్టలు దానిచర్యలటు చిందవందర చేయుమానసం
బెట్టుల వీడ్వఁగంగలనొ యీదురవస్థను వెంకటేశ్వరా॥ 105

ఉ. సత్పథదాయి! లోకముల సర్గము పాలన సంహృతిన్విలా
సోత్పథలీలఁ జేయుచు నిజోరుమహత్త్వమునన్ సురారిసం
పత్పతనంబొనర్చు నినుఁ బ్రస్తుతిఁ జేసెద చిత్తగింపుమీ
యుత్పలచంపకప్రసవయోజితమాలల వెంకటేశ్వరా॥ 106

చం. శతకమనంగ నూరగును చాలగ నెన్మిదిఁ జేర్చినంత నే
శతకము పైన నష్టకము జానగు, నట్టులఁ గూర్చి చెప్పితిన్
అతితరభక్తిభావమున నబ్జవిలోచన! నీపదంబులే
గతియనినమ్మి, నాకృతిని గైకొని బ్రోవుము వెంకటేశ్వరా॥ 107

ఉ. రేపలి తాలూకాను గల శ్రీసిరిపూడి నివాసి, నారువేల్
బాపలశాఖలోఁ గడుఁ జెలంగిత యల్లయ ప్రగ్గడాఖ్యతో
రూపగు వంశమందు, చతురుండనఁ బేరును సుబ్బరాయడన్
ప్రాపు నొసంగి బ్రోవగదె పద్మవిలోచన వెంకటేశ్వరా॥ 108

—హరిః ఓం తత్సత్—

భారతీప్రెస్, తెనాలి. 1949

ఈ గ్రంథకర్తగారిచే రచింపబడిన గ్రంథములు

1. శ్రీ సీతారామ శతకము (అచ్చయి వున్నది)
2. శ్రీ వెంకటేశ్వర శతకము ,,
3. శ్రీ మల్లిఖార్జున శతకము (అచ్చులోనున్నది)
4. శ్రీ నరసింహ శతకము ,,
5. శ్రీ రుక్మిణీవిజయము (ప్రబంధము) ,,
6. శ్రీ ఆంజనేయ శతకము ,,
7. ఖండకావ్యముల సంపుటి ,,
8. రామేశ్వర యాత్ర ,,
9. ఘటికాచలక్షేత్ర మహత్మ్యము ,,

దొరకుతావు:

యల్లాప్రగడ వెంకటసుబ్బారావు
సిరిపూడి (రేపల్లె తాలూకా)

